శ్రీమతే రామానుజాయనమః



# నిత్యానుష్ఠాన క్రమ సంగ్రహము

శ్రీరంగ దివ్యస్థల ఆచార్య పురుషులును, కోరుకొండ
శ్రీ లక్ష్మీనృసింహ దేవస్థాన వంశపారంపర్య ధర్మకర్తలు నైన

## శ్రీ ఉ. వే. ప్ర. శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టరు

స్వామివారిచే అనుగ్రహింపబడినది.

---

(మద్రాసు గీతామందిరమున 10-7-66 మొదలు 28-8-66 వఱకు
జరిగిన బ్రహ్మవైవర్తపురాణ కాలక్షేప శాత్తుముఱనాటి ప్రచురణ)

శ్రీజయా ముద్రాక్షరశాల, మద్రాసు-21.

1966

ఎక్కువ ఉత్సాహమునకు

ఎక్కువ పటుత్వమునకు

# ఆల్వి టోన్

## త్రాగండి

# ALVITONE

ఆల్వి టోన్ లెబరేటరీస్,
మద్రాసు - 49.

శ్రీమతే రామానుజాయనమః



# నిత్యానుష్ఠాన క్రమ సంగ్రహము

ఆస్తిక మహాజనులారా!

"దుర్లభో మానుషో దేహః దేహినాం క్షణభంగురః
తత్రాపి దుర్లభం మన్యే వైకుంఠప్రియదర్శనం"

అనినట్లుగా మనుష్యజన్మమును పొందుట దుర్లభము. ఒకవేళ లభించినను చిరకాలముండుట దుర్లభము. ఒకవేళ చిరకాలముండినను భగవద్భక్తికలిగిన వారిని సేవించు భాగ్యము కలుగుట దుర్లభము అని ఋష్యా

దులు చెప్పినట్లు, పూర్వజన్మ సుకృతంవలన మనకు మనుష్యజన్మ లభించినది. పైగా పుణ్యభూమి అయిన భరతఖండములో జన్మించినాము. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం" అని శరీరముతోనే సాధనానుష్ఠానముచేసి భగవదనుగ్రహమును సంపాదించి, తరించవలయును. ఇట్టి సదవకాశమును జారవిడిచి భగవదనుగ్రహమును సంపాదించనియెడల మనకు మరల ఏ జన్మ లభించునో తెలియదు.

భగవంతుని యనుగ్రహమును సంపాదించినయెడల, భుక్తియు, ముక్తియు లభించును. అట్టి భగవదనుగ్రహమును సంపాదించుటకు శాస్త్రీయమైన, నిత్య నైమిత్తికాది కర్మలను ఆచరించవలయును. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ'' అనియు, శాస్త్రము నతిక్రమించి తనకు తోచినట్లు నడచువాడు అసురడనియు అట్టివానిని, నేను పలు అసురజన్మలెత్తేటట్టుగా చేయుదుననియు భగవద్గీతలో 16-వ అధ్యాయమున (దైవాసుర సంపద్విభాగయోగమున) భగవానుడే ఆనతిచ్చియున్నాడు. గాన

మనము (స్త్రీలు, పురుషులు) ఆబాలవృద్ధులువరకు శక్తి వంచనలేకుండ శాస్త్రీయకర్మలను ఆచరించుచూ, దుష్కర్మలను చేయకుండవుండవలయును. అందుకుగాను, అందరు నిత్యము అనుష్ఠించవలసిన కొన్ని ముఖ్య విధులను, త్యాజ్యవిషయములను, ముఖ్యమైన కొన్ని భగవత్స్తోత్రములను యీ చిన్న గ్రంథమున పొందుపరచుచున్నాము. దీనిని, అందరు తీసుకొని శ్రద్ధగా పఠించి అనుష్ఠానముచేసి సర్వేశ్వరుని కరుణాకటాక్షమునకు పాత్రులుకావలయునని కోరుచున్నాము. ఈగ్రంథము గీతామందిరమున 10-7-66 మొదలు 28-8-66 వరకు ఉదయమున మూలమంత్రార్థసార కాలక్షేపమును, సాయంత్రమున వ్యాసప్రణీత బ్రహ్మవైవర్తమహాపురాణ కాలక్షేపమును సాయించిన శ్రీరంగం శ్రీ. ఉ. వే. శ్రీమాన్ పరాశర సుదర్శనభట్టరుస్వామి (కోరుకొండ భట్టర్ స్వామి) వారిచే వ్రాయబడి భక్తుల సహాయముతో అచ్చొత్తింపబడి, బ్రహ్మవైవర్తపురాణ కాలక్షేప చాత్తుమొర రోజున 28-8-66 వ తేది ప్రకాశింపబడినది. ఈ గ్రంథమును వ్రాసియిచ్చిన స్వామివారికిన్ని, ప్రచు

రించుటకు సహాయపడినవారికిన్ని, ఇతరవిధముల సహకరించినవారికిన్ని మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాము.

ఈ పుస్తకమును ఉచితముగా మీ కందజేయగలిగినందుకు సంతసించుచున్నారము.

స్థానం
గీతామందిరం
107, వరదాముత్తయప్పన్ వీధి,
జి. టి. మద్రాస్-1.
తే 28-8-1966

ఇట్లు
భక్తబృందము

# ముఖ్యమైన నిత్యకృత్యములు

ప్రతిదినము ప్రాతఃకాలముననే "హరిః హరిః" అనుచూ లేచి, పాదప్రక్షాళణాదులను చేసుకొని, ఒకచోట కూర్చొని గురుపరంపరానుసంధాన పూర్వకముగా, ద్వయమంత్రమును అనుసంధించి, తదుపరి అవకాశము ననుసరించి శ్రీరంగనాథస్తోత్రము ముకుందమాల ఇత్యాది పెరుమాళ్ళ స్తోత్రములను అనుసంధించి తదుపరి స్నానాద్యనుష్ఠానములు చేసుకొనవలయును.



Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

# శ్రీ రంగనాథాష్టకం

శ్రీ పరాశరభట్టరువారు సాయించినది

శ్లో. సప్తప్రాకారమధ్యే సరసిజముకుళో ద్భాసమానే
విమానే
కావేరీమధ్యదేశే మృదుతరఫణిరాడ్భోగపర్యంకభాగే
నిద్రాముద్రాభిరామం కటినికటశిరః పార్శ్వవిన్యస్త
హస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగరాజం
భజేహం. 1

తా. శ్రీరంగ క్షేత్రమున, ఉభయకావేరీ మధ్య ప్రదేశమున, ముకుళించిన తామరపుష్పమువలె ప్రకాశించు ప్రణవాకార విమానమున, ఆదిశేషునిపై పవళించి, నిద్రను అభినయిస్తూ, ఒక శ్రీహస్తమును కటి భాగమునను, ఒక శ్రీహస్తమును శిరోభాగమునను వుంచుకొని, శ్రీదేవి, భూదేవులచేతను పరిచర్యచేయబడు శ్రీరంగనాథుని తిరువడిగళను ధ్యానించుచున్నాను.

శ్లో. కస్తూరీకలితోర్ధ్వపుండ్రతిలకం కర్ణాంతలోలేక్షణం
ముగ్ధస్మేరమనోహరాధరతలం ముక్తాకిరీటోజ్జ్వలం
పశ్యన్మానసపశ్యతోహరరుచిం పర్యాయపంకేరుహం
శ్రీరంగాధిప తేః కదానువదనం సేవేయ భూయోప్యహం.

తా. కస్తూరీ కలిత ఊర్ధ్వపుండ్రమును ధరించి, ఆకర్ణాంత విశ్రాంత నేత్రములతోను, చిరునవ్వుతో కూడిన మనోహరమైన అధర

ములతోను, ముత్యపుకిరీటముతోను, సేవించువారి మనోనయనములను ఆకర్షించు ముఖారవిందముతో వేంచేసియున్న శ్రీరంగనాథుని నేను, మరల యెప్పుడు సేవించుదును ?

శ్లో. కదాహం కావేరీ తటపరిసరే రంగనగరే
శయానంభోగీంద్రే శతమఖమణిశ్యామళరుచిం
ఉపాసీనః క్రోశన్ మధుమదన నారాయణ హరే
మురారే గోవిందేత్యనిశమనునేష్యామిదివసాన్. 3

తా. కావేరీతీరమున, శ్రీరంగదివ్యనగరమున, ఆదిశేషునిపై శయనించియున్న, మరకతమణివలె ప్రకాశించు, శ్రీరంగనాథుని మధుమదన! నారాయణ! హరే! మురారే! గోవిందా! యను తిరునామముల ఎల్లప్పుడు ననుసంధించుచూ గడపు కాలము ఎప్పుడు లభ్యమగును ?

శ్లో. కదాహం కావేరీ విమలసలిలే వీతకలుషః
భవేయం తత్తీరే శ్రమముషివసేయం ఘనవనే
కదావా తంపుణ్యే మహతిపులినే మంగళగుణం
భజేయం రంగేశం కమలనయనం శేషశయనం. 4

తా. నిర్మలమగు కావేరీనదిలో స్నానమొనరించి మాలిన్యమును పోగొట్టుకొని, నదీతీరముననున్న శ్రమహరమైన తోటలలో నేను యెన్నడు నివసించుదునో! ఆ పవిత్రమైన ఇసుకతిన్నెలలో కూర్చొని, కల్యాణ గుణములుగల శేషశయనుని, కమలనయనుని, నేను యెన్నడు ధ్యానింతును ?

శ్లో. పూగీకంఠద్వయస సరస స్నిగ్ధనీరోపకంఠాం
ఆవిర్మోదస్తిమితశకునానూదితబ్రహ్మఘోషాం

మార్గే మార్గే పథికనివహైరుంచ్యమానాపవర్గాం
పశ్యేయం తాం పునరపిపురీం శ్రీమతీం రంగధామ్నః. 5

తా. కావేరీప్రాంతమున కొంత నీటిలో మునిగియున్న పోకచెట్లపై కూర్చొని యుండుపక్షులచే చక్కగా పరబ్రహ్మనుగూర్చి కూయబడు చున్నటువంటిన్ని, మార్గములలో యెత్తైన వృక్షములు గలిగినటువంటిన్ని, సుందరమైన శ్రీరంగనగరమును నేను మరల యెప్పుడు చూచుదును ?

శ్లో. నజాతుపీతామృతమూర్ఛితానాం
నాకౌకసాం నందన వాటికాసు
రంగేశ్వర! త్వత్పుర మాశ్రితానాం
రథ్యాశునామన్యతమో భవేయం. 6

తా. స్వర్గములో అమృతమునుగ్రోలి పుష్పోద్యానవనములలో క్రీడించుటను నేను కోరను. నీ నగరమును ఆశ్రయించుకొనియున్న శ్వానములో ఒక శ్వానముగా జన్మించుటను నేను కోరుచున్నాను. (అనగా దివ్యదేశ వాసము శ్రేష్ఠమనియు, దివ్యదేశ సంబంధముగల నిహీనజన్మ అయినను శ్రేష్ఠమే యని దాని తాత్పర్యము).

శ్లో. అసన్నికృష్టస్య నికృష్టజంతోః
మిథ్యాపవాదేన కరోషి శాంతిం
తతోనికృష్టే మయిసన్నికృష్టే
కాం నిష్కృతిం రంగపతే కరోషి. 7

(ఈ శ్లోకమున స్వనైచ్యానుసంధానము చేయుచున్నారు.)

తా. రంగనాథా! నిహీనమైన జంతువులు నీ సమీపమునకు రాకపోయి నను సన్నిధిలో ప్రవేశించినమాత్రమున, శుద్ధికోసరం సంప్రోక్షణాదులను చేసుకొనుచున్నావే! నీచాతినీచుడనగు నేను నీ సమీపమునకు వచ్చినప్పుడు ఏమి పరిహారమును చేసుకొనెదవు?

శ్లో. శ్రీరంగం కరిశైలమంజనగిరిం తార్క్ష్యాద్రి సింహాచలౌ
శ్రీకూర్మం పురుషోత్తమంచ బదరీనారాయణం నైమిశం
శ్రీమద్వారవతీ ప్రయాగమథురా అయోధ్యా గయా
పుష్కరం
సాలగ్రామగిరిం నిషేవ్యరమతే రామానుజోయం
మునిః.

తా. శ్రీరంగము, కాంచీపురం, తిరుమల, తిరునారాయణపురం, సింహాచలం, శ్రీకూర్మము, శ్రీజగన్నాథము, బదరీనారాయణము, నైమిశారణ్యము, ద్వారకా, ప్రయాగ, మధుర, అయోధ్యా, గయా, పుష్కరం, సాలగ్రామగిరి, మొదలైన దివ్యదేశములను సేవించి ఆనందించిన, జగదాచార్యులైన ఎంబెరుమానార్లను ధ్యానించుచున్నాను.

శ్రీరంగనాథాష్టకం సంపూర్ణం.

## పిరాట్టి విషయమై భట్టరువారి శ్రీ సూక్తి

శ్లో. శ్రియై సమస్త చిదచిద్విధాన వ్యసనం హరేః
అంగీకారిభి రాలోకై: సార్థయన్త్యై కృతోంజలిః.

తా. సర్వేశ్వరునికి సకల చేతనా చేతన వస్తుసృష్టివలన కలిగిన శ్రమమును, అంగీకారసూచకములగు కటాక్షవీక్షణములచే, సఫలము చేయుచున్న పిరాట్టికి (అనగా లక్ష్మీదేవికి) అంజలి చేయడమైనది.

## ఉడయవరుల విషయమై భట్టరువారి శ్రీసూక్తి

శ్లో. రామానుజ మునిర్జీయాత్ యోహరే ర్భక్తియంత్రతః
కలి కోలాహల క్రీడా ముఖాగ్రహ మపాహరత్.

తా. ఏ యెంబెరుమానార్లు, హరిభక్తియను యంత్రముచే, కలి పురుషుని కోలాహలక్రీడ (ఆటయను) పిశాచమును పారద్రోలినారో అట్టి రామానుజులు పల్లాణ్డుపల్లాణ్డుగా వేంచేసియుండవలెను.

## స్నానముచేయునప్పుడు అనుసంధించవలసిన శ్లోకము

శ్లో. అనంత సరసీతోయం కల్యాణీ సరసీపయః
ఇదంతు విరజాతోయం కావేరీ సర్వతోముఖీ.

తా. తిరుమల, కాంచీ మొదలగు దివ్యదేశములలోనుండు పుష్కరణీ తీర్థములను, కావేరీతీర్థమును మనస్సున భావించుకొనవలయును.

స్నానముచేసిన తరువాత, కేశవాదినామములతో పుండ్రములను ధరించి, గురుపరంపర, తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకములను, స్వాచార్యులు మొదలు సర్వేశ్వరుని పర్యంతముండు పూర్వాచార్య తనియన్లను అనుసంధించి, సంధ్యావందనముచేసి, పెరుమాళ్లకు తిరువారాధనమును

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



షోడశోపచారములతో సమర్పించి, తీర్థప్రసాదములను స్వీకరించవలయును. మాధ్యాహ్నికమునుచేసి, సాపాటు చేయవలెను. పగలు విశ్రాంతి సమయములోను, రాత్రి విశ్రాంతిసమయములోను, అవకాశమునుబట్టి, శ్రీ రామాయణము, శ్రీ భాగవతము, మొదలగు గ్రంథములను, స్తోత్రములను ఆళ్వార్లు సాయించిన దివ్యప్రబంధములను సేవించవలయును. (అర్థానుసంధానముతో).

సాయంకాలమున సంధ్యావందనమును చేయవలయును.

పగలుగాని, రాత్రిగాని విరామసమయములలో అనుసంధించవలసినది—

# అష్టశ్లోకి

## శ్రీ పరాశరభట్టర్ సాయించినది

శ్లో. శ్రీ పరాశరభట్టార్యః శ్రీరంగేశ పురోహితః
శ్రీవత్సాంక సుతఃశ్రీమాన్ శ్రేయసే మేఽస్తుభూయసే.

ఈ అష్టశ్లోకీ యను 8 శ్లోకములుగల గ్రంథములో, ముఖ్యముగా మనము తెలుసుకోవలసిన తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకముల అర్థ విశేషములు చెప్పబడుచున్నవి.

శ్లో. అకారార్థో విష్ణుః జగదుదయ రక్షా ప్రళయకృత్
మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవమిదం

ఉకారోనన్యార్హం నియమయతిసంబంధమనయోః
త్రయీసారస్త్ర్యాత్మా ప్రణవమిమమర్థం సమదిశత్. 1

తిరుమంత్రములో (అనగా అష్టాక్షరీ మంత్రములో) ఓమ్ అను మొదటిపదమునగల మూడువర్ణములచేతను (అనగా అ-ఉ-మ అను మూడు అక్షరములచేతను) మూడు అర్థములు గ్రహించవలయును.

అ-అను అక్షరముచే. జగత్కారణుడగు పరమాత్మయున్ను. మ-అను అక్షరముచే జీవాత్మయున్ను. ఉ-అను అక్షరముచే. ఆ వుభయులకు గల సంబంధము అనన్యార్హమనియు తెలియదగును అని వేదసారమగు ప్రణవము మనకు తెలియజేయుచున్నది.

శ్లో. మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసఃస్వరూపంగతిః
గమ్యం శిక్షితమీక్షితేన పురతః పశ్చాదపిస్థానతః

స్వాతంత్ర్యం నిజరక్షణం సముచితా వృత్తిశ్చ నాన్యో
చితా

తస్యైవేతి హరేర్వివిచ్యకథితం స్వస్యాపి నార్హాంతతః.2

అష్టాక్షరీమంత్రములో మధ్యనవున్న 'నమః' అను పదమును, ముందుండు ప్రణవములోని మకారముతోను, వెనకవుండు 'నారాయణాయ' అను పదముతోను చేర్చి అన్వయించి అర్ధము గ్రహించినను, లేక అక్కడనే రెండుపర్యాయములు ఆ వృత్తిచేసి చేరియున్న నమః పదముతోను అన్వయించి అర్థము గ్రహించుటచేతను, మూడు అర్థములు గోచరించుచున్నవి. అవియే స్వరూప, ఉపాయ, పురుషార్థములు. అవి మూడున్ను శోధించబడుచున్నవి. ఈ జీవుడు పరమాత్మకే శేషమనియు, స్వతంత్రుడుకాడనియు, ఉపాయము సర్వేశ్వరుదేయనియు, శ్రీమన్నారాయణునికే సకలవిధ కైంకర్యములను చేయవలయుననియు తెలియుచున్నది.

శ్లో. అకారార్థాయైవ స్వమహమథమహ్యం న నివహాః
నరాణాం నిత్యానాం అయనమితి నారాయణపదం
యమాహాస్మై కాలం సకలమపి సర్వత్ర సకలాసు
అవస్థాస్వావిస్స్యుర్మమసహజకైంకర్యవిధయః. 3

(ఈ శ్లోకమున నారాయణ శబ్దార్థము చెప్పబడుచున్నది.)

అకారవాచ్యుడైన భగవంతునికే నేను దాసుడను. నాకు నేను శేషభూతుడనుగాను. నారములకు అయనమైనవాడు నారాయణుడు. నారములనగా నిత్యవస్తువులయొక్క సమూహములు. వాటికి అయనం అనగా ఆధారమైనవాడు. జ్ఞానానందాదిగుణములకున్ను జీవాత్మమొదలైన పదార్థములకును ఆధారమై, ప్రాప్యమై, ప్రాపకమై యున్నాడు. గాన, నారాయణనుకే సర్వదా, సర్వవిధకైంకర్యములను చేయవలయును.

శ్లో. దేహాసక్తాత్మబుద్ధిర్యదిభవతిపదంసాధువిద్యాత్ తృతీయం
స్వాతంత్ర్యాంధోయదిస్యాత్ ప్రథమం
ఇతరశేషత్వధీశ్చేత్ ద్వితీయం
ఆత్మత్రాణోన్ముఖశ్చేత్ నమఇతిచపదం
బాంధవాభాసలోలః శబ్దంనారాయణాఖ్యం
విషయచపలధీశ్చేత్ చతుర్థీం ప్రపన్నః 4

తా. దేహాత్మభ్రమ కలిగినప్పుడు ప్రణవములోని 'మ' కారార్థమును, స్వతంత్రుడనేభావం గలిగినప్పుడు ప్రణవములోనిమొదటి అక్షరమైన 'అ' కారార్థమును, ఇతరులకు శేషము అనేభావం గలిగినప్పుడు, ప్రణవములోని మధ్యమాక్షరమగు 'ఉ' కారార్థమును, తనకుతానే రక్షకుడు అనేభావం గలిగి

నప్పుడు తిరుమంత్రములోని మధ్యమపదమైన 'నమః' పదముయొక్క అర్థమును, తనకు బంధువులుగాతోచే పుత్రమిత్ర, కళత్రాదులయందు ఆశగలిగితే తిరుమంత్రములో "నారాయణ" పదముయొక్క అర్థమును, ఇతరవిషయములయందు చాపల్యముగలిగితే, "నారాయణాయ" అనుచోటవున్న 'ఆయ' అను చతుర్థీవిభక్త్యర్థమును గ్రహించవలయును.

శ్లో. నేతృత్వం నిత్యయోగం సముచితగుణజాతం తనుఖ్యాపనంచ

ఉపాయం కర్తవ్యభాగం త్వదమిథునపరం ప్రాప్యమేవం ప్రసిద్ధం

స్వామిత్వం ప్రార్థనాంచ ప్రబలతర విరోధి ప్రహాణం
దశైతాన్ మంతారం త్రాయతేచే త్యధిగత నిగమష
డ్పదోయం ద్వ్యఖండః. 5

తా. రెండు వాక్యములతోను, ఆరు పదములతోను వున్న ద్వయ మంత్రార్థము వివరింపబడుచున్నది.

పిరాట్టియొక్క (లక్ష్మీదేవియొక్క) పురుషకారమును, నిత్యసంబంధమును, సర్వేశ్వరుని కల్యాణగుణములును, దివ్యమంగళ విగ్రహప్రకాశమును చేయదగిన ఉపాయాంశమును, పిమ్మట, లక్ష్మీనారాయణరూపమైన శ్రేష్ఠమగు ఫలమును, సర్వేశ్వరుని స్వామిత్వమును కైంకర్యప్రార్థనయు ప్రబలముగానుండు విరోధులైన అహంకార మమకారములను విడుచుటయును, అను కర్తవ్య వివరణము చెప్పబడుచున్నది.

శ్లో. ఈశానాం జగతామధీశదయితాం నిత్యానపాయాం
శ్రియం
సంశ్రిత్యాశ్రయణోచితాఖిలగుణస్యాంఘ్రీహరేరా
శ్రయే
ఇష్టోపాయతయాశ్రియాచసహితాయ ఆత్మేశ్వరాయా
ర్థయే
కర్తుందాస్యమశేషమప్రతిహతంనిత్యం త్వహంనిర్మమః

తా. ఈలోకములకు నియామకురాలై, సర్వేశ్వరునికి యిష్టమహి
షియై, సర్వేశ్వరునితో యెప్పుడు విశ్లేషములేని, శ్రీమహాలక్ష్మిని పురుష
కారముగా శరణుజొచ్చి, పిమ్మట, ఆశ్రితులు శరణుజొచ్చుటకు అర్హము

లైన (అనువైన) వాత్సల్యాదిగుణములచే [illegible]న్ని సర్వపాపనివర్తకుడైనటువంటిన్ని సర్వేశ్వరునియొక్క తిరువడిగళను(పాదారవిందములను) నేను మోక్షరూపమైన ఫలమునకు తగిన సాధనముగా వరించుచున్నాను.

శ్రీమహాలక్ష్మితో కూడియున్నటువంటిన్ని, సర్వాత్మలకు నియామకుడైనటువంటిన్ని శ్రీమన్నారాయణునికి దాసుడు, అహంకార మమకారములు లేకుండ, సర్వవిధకైంకర్యములను సర్వకాల సర్వఅవస్థలలోను చేయుటకు ప్రార్థించుచున్నాను.

శ్లో. మత్ ప్రాప్త్యర్థతయా మయోక్తమఖిలంసంత్యజ్యధర్మం పునః
మామేకం మదవాప్తయే శరణమితి ఆర్తోవసాయంకురు

త్వామేవం వ్యవసాయయుక్తమఖిల జ్ఞానాది పూర్ణో
హ్యహం
మత్ప్రాప్తి ప్రతిబంధకైః విరహితం కుర్యాం శుచంమా
కృధాః. 7

(7, 8, శ్లోకములచేతను చరమ శ్లోకార్థము చెప్పబడుచున్నది.)

తా. నీకు హితోపదేశముచేయు నాచేతను నన్ను పొందుటకు సాధనములుగా జెప్పబడిన కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములనే మోక్షసాధనములను విడిచి, ఆ కర్మయోగాదులను అనుష్ఠించుటకు శక్తిలేక వ్యసనపడుచున్న నీవు, నన్ను ఒక్కనినే ఉపాయముగా విశ్వసించుము. ఈవిధముగ నిశ్చయించుకొనియుండు నిన్ను, జ్ఞానశక్త్యాదిగుణములతో కూడియుండు నేను, నన్ను పొందుటకు ప్రతిబంధకములుగా నుండు

పుణ్య పాపరూపములగు సమస్త కర్మములనుండియు విడిపించెదను. శోకించకము.

శ్లో. నిశ్చిత్యత్వదధీనతాం మయిసదా కర్మాద్యుపాయాన్హరే
కర్తుంత్యక్తుమపి ప్రపత్తుమనలం సీదామి దుఃఖాకులః
ఏతత్ జ్ఞానముపేయుషో మమ పునస్సర్వాపరాధక్షయం
కర్తాసీతి దృఢోస్మితేతుచరమం వాక్యం స్మరన్ సారథేః.

తా. సర్వేశ్వరా! నేను యెప్పుడు నీకు పరాధీనుడనగుటచే, ఈ కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములనే మోక్షోపాయములను అనుష్ఠించుటకు నాకు స్వాతంత్ర్యములేదు. ఈవుపాయములనుఅనుష్ఠిచుటకుఅశక్తుడనై యున్నాను. మోక్షపురుషార్థములో యిచ్ఛగలిగియున్ననేను వాటినిఅను

ష్ఠించుటకుగాని, వదలుటకుగాని అశక్తుడనై యున్నాను. ప్రపత్తియును మహా విశ్వాసముతో చేయదగినదగుటచే, దానినికూడ అనుష్ఠించుటకు శక్తుడను గాను.ఈవిధముగా ఏగతియులేనివాడనై దుఃఖించుచున్నాను. ఇట్టినేను, మీరు అర్జుననకు సారథిగా యుండి చేసిన హితోపదేశములో మీకడపటివార్తయైన చరమశ్లోకములో, "నీవు నన్ను శరణుజొచ్చుము, నేను నిన్నుఅన్ని పాపములనుండి విడిపించెదను" అని సాయించినదానిని దలంచుకొని, మహా విశ్వాసముతో వున్నాను.



# ముఖ్య సూచన

మనము శాస్త్రవిహితమగు కర్మలనుచేయుచూ, శాస్త్రనిషిద్ధమైన పనులను ఆచరించకుండ అతిజాగరూకులై యుండవలయును. ఎన్ని సత్కర్మలను ఆచరించినను, ఒక అసత్కర్మను చేసిన యెడల చేసిన సత్కర్మలన్నియు వ్యర్థములే యగును. సత్కర్మములు ఔషధముల వంటివి. అసత్కర్మలు పథ్యము వంటిది. పథ్యము చేయక ఔషధమును సేవించినయెడల, అదియెటుల రోగనివారణ చేయజాలదో, పైగా, అపథ్యముచేయుటవలన లేని రోగములుకూడ కల్గునో అటులనే, చేయరాని దుష్కర్మలను ఆచరించుటవలన, సర్వేశ్వరుని నిగ్రహమునకు గురిఅయి, అధోగతిపాలగుదుము. గాన, శాస్త్రములో నిషేధింపబడిన యీ క్రింది కార్యములను ముఖ్యముగా చేయకూడదు.

# అకృత్యములు (చేయరానివి)

1. అసత్యమాడుట
2. పరుల కపకారమొనర్చుట
3. జీవహింస
4. పరద్రవ్యాపహారము
5. పరస్త్రీ గమనము
6. భగవత్, భాగవత, అసహ్యాపచారములు
7. ఆత్మ స్తుతి, పరనిందా
8. అసూయా
9. పితృఋణములు తీర్చకుండుట మొదలగునవి.

ఈ చిన్నగ్రంథములో వ్రాయబడినట్లుగా అందరు అనుష్ఠించి, భగవదనుగ్రహమునకు పాత్రులుకావలెనని కోరబడుచున్నారు.

సమస్త మంగళాని భవంతు,

ఓం శాంతిః శాంతిః శాంతిః.

**Wherever you go !**

*The Bright Builders Hardware*
*that Attract Your Attention*
*is of*

# P. V. R. C. B.

QUALITY MAKE

*Your specific needs are positively*
*met to your approbation*



PHONE NO. 31438

**P. V. Rathakrishna Chetty & Bros.,**

45, Venkatachala Mudaly Street,

Madras-3.

*For Quality Breads, Tasty Cakes & Confections*

ALWAYS VISIT

# COMMERCIAL & CO.

**17/18, Broadway, Madras-1.**

*Bakers & Confection Specialists*
*in the Manufacture of Cake Novelties Etc.,*

*Factory :*

**7, Philips Street, Madras-1.**

---

*(Show Room)*

# COMMERCIALS

**2/17, Govindappa Naick Street, Madras-1.**

**S. V. Chenchuramaiah, S. V. Ramaswami.**

**(Sons of Sami Venkatesaperumal Chetty)**

ఈ గ్రంథప్రచురణలో

ప్రచురణకై

అడ్వర్టైస్ మెంటు

యిచ్చినవారికి

కృతజ్ఞతావందనములు

సమర్పించబడినది.

